'జయశివరంజన, జయభవభంజన, జయకరుణాకర, జయసురభీకర, జయగతదూషణ, జయబుధభాషణ, జయగణరాజిత, జయగణపూజిత, జయజయ శ్రీబసవదండనాథ నమస్తే'-ఇదియే.

జయశివరంజన
జయభవభంజన
జయకరుణాకర
జయసురభీకర
జయగతదూషణ
జయబుధభాషణ
జయగుణరాజిత

పై విధముగ ముద్రించిన నిదిసప్తమీవిభక్తి యుక్కలికకు దీనికి భేదములేదు గదా!

'సురగిరిమందర
నిరుపమకందర
ఘనహారిచందన
వనమయనందన.'

పాల్కురికి సోమనాథుఁడు 'ఆరూఢిగద్యపద్యాదిప్రబంధ భూయిష్ఠరచన' యనుచో గద్యమన నిట్టిదియని యెఱుంగునది. అచ్చట గద్యమన నేఁటివచనముగాదు.

ఆంధ్రలాక్షణికులలో నుదాహరణలక్షణముఁ దొలుత, అనంతుని ఛందోదర్పణమున నీయఁబడినది. ఛందోదర్పణము కన్న మున్నైన కవిజనాశ్రయమున * నీలక్షణము లేదు. అనంతు

వివెనుక, చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహమునను, అప్పకవీయమునను నీయుదాహరణలక్షణములు లక్ష్యములతో సహిత మీయఁ బడియున్నవి. అనంతచ్ఛందస్సున :

సీ. భాసిల్లు సప్తవిభక్తులం దును మఱి
సంబోధనంబును సరవిఁ గాఁగఁ
బ్రభునామయుతముగాఁ బద్య మొక్కటియును
దగఁజెప్పి రగడభేదంబులందు
కళికలు ప్రత్యేకదళము లెన్మిదిచేసి
తత్పరార్ధముల నుత్కళికలనఁగ
నేకసమాసమై యేడుదళంబులు
తుద విభక్త్యర్థంబుఁ దోఁపఁ బలుక
దాని కెనఁ గాఁగఁ జిక్కన దళమమర్చి
ఫణితులోడఁ గూర్చు సార్వవిభక్తికముగఁ
గట్టకడపటిపద్య మొక్కటి రచింప
నది యుదాహరణంబగు నబ్జనాభ ! (3-63).

అని లక్షణము. లక్షణసారసంగ్రహమున—

'సప్తవిభక్తులు సంబోధనంబునఁ
గలుగు నెన్మిదివిభక్తులు గ్రమమున
పతిపేరుతోఁగూడఁ బద్య మొకొక్కటి
రచియించి రగడమార్గమ్ము జాడ

కళికకు నెనిమిది దళములు తాఁ జెప్పి
తత్పూర్వార్ధమున నుత్కళికఁ జెప్పి
అదియు నేకసమాస మైయుండు దళముల
కును విభక్త్యర్థంబు గనఁగఁ జేసి
దానికినిగాగ నెన్మిదో దళముఁ గూర్చి
పద్యమొక్కటి సార్వవిభక్తికముగ
నందుఁ దుదఁ గూర్ప నది యుదాహరణమగు
ధీర ! యో యాంజనేయ ! సుధీవిధేయ.

దీనికిలక్ష్యము ఆంజనేయోదాహరణము—2 ఆశ్వాసము.

అప్పకవీయమున:

సప్తవిభక్తులు సంబోధనంబునఁ
గూడ నెన్మిదివిభక్తులు క్రమమునఁ
బతిపేరు దొరలంగఁ బద్యమొక్కటిచెప్పి
రగడభేదములు మార్గములుఁ గాఁగ
కళికలు నెనిమిది దళములు గావించి
దానిలో సగము నుత్కళికఁ జేసి
యది యొక్క సమాసం బయ్యెడుదళములె
న్మిదిఁ గూర్చి దానికిఁ దుద విభక్తి
బయలుపఱిచి కట్టకడను పద్యమొకటి
పలుకవలయును సార్వవిభక్తికముగ

నిర్వ్యదాఖ్యపద్యములందు నిడిన ధాత్రి
నిది యుదాహరణములందు రిద్ధచరిత !

దీనికిలక్ష్యము—కృష్ణోదాహరణము.

ఈయుదాహరణమున నెనిమిది విభక్తులకు నీ క్రింది వేల్పు లధిదేవతలు—

ప్రథమకు—వాణి, వీరావళి.
ద్వితీయకు—ఝుట, కీర్తిమతి.
తృతీయకు—కీర్తి, సుభగ.
చతుర్థికి—దేవలాభిని, భోగమాలిని.
పంచమికి—పాణి, కళావతి.
షష్ఠికి—లలిత, కాంతిమతి.
సప్తమికి—ఘోణి, కమల.
సంబోధనమునకు—సరసాళి, జయపతి.

అప్పకవి చెప్పిన యీయధిదేవతలలో, వీరావళి, కీర్తిమతి, సుభగ, భోగమాలిని, కళావతి, కాంతిమతి, కమల, జయపతి యనువారిని మాత్రమే రంగకవి రంగరాట్ఛందస్సునం బేర్కొనినాఁడు. ఈపేరులుఁ గలుగఁజెప్పినఁ దద్దేవతలు సకలశుభంబు

* రంగరాట్ఛందస్సున భీమనయుదాహరణముల కీలక్షణములఁ జెప్పెనని వైలక్షణములే వచనములో వ్రాయఁబడియున్నవి, గాని నేఁడు భీమనకృతముగా వెలయుచున్న కవిజనాశ్రయమున నుదాహరణలక్షణముగాని వైవచనముగాని లేదు. కస్తూరిరంగకవి తనఛందమున నే లక్షణగ్రంథమునుండి దీనిని వ్రాసెనో తెలియదు.

బోసఁగుదు రని చెప్పినాఁడు. అప్పకవి యుదాహరణములలో నీనాలుగు తెగలు కలవని యిట్లు చెప్పినాఁడు.

సీ. సంబుద్ధియెడలించి సప్తవిభక్తులు
పలికిన భక్తి సద్దళి యనంగ
సంబుద్ధితోఁగూడ సప్తవిభక్తులు
పలుకనొప్పారు బద్దళి యనంగ
సంబుద్ధితోడ విషమవిభక్తులతోడఁ
బలికినకృతి యు విద్దళి యనంగఁ
గళిక లుత్కళికలు గమకింపఁబలికిన
కావ్యంబు నుత్ఫుల్లకంబు ననఁగ
నవనిఁ జాటుప్రబంధము లందు మిగుల
నాటుకొని యొప్పుచుండు నీనాల్గుదెగలుఁ
గానఁబడు నుదాహరణముల్ గానలోల!
కామపల్లీశ! వల్లవీకామ! కృష్ణ!

సద్దళి, పద్దళి, విద్దళి, ఉత్ఫుల్లకము నను నీనాలుగును నుదాహరణపరిణామమునుఁ గ్రమముగ సూచించుచున్నవి. ఉదాహరణములలోఁ దొలుత దేశికవితయే వెలసిన దనుటకు నీనాలుగుదశ లెంతయేని తోడ్పడుచున్నవి. పై నాలుగింటి లో మార్గజాతిపద్యము లేకుండుట గమనింపఁ దగినది. దేశిపదములనుండి యుత్పన్నమైన వృత్తాములకు విభక్తిప్రత్య యముల జేర్చి తాళలయాన్వితముగా నుదాహరణములు

తొలుత రచింపఁ బడినవి. ఆవెనుక సంస్కృతచ్ఛంద ప్రస్తారముచే, మార్గజాతిపద్యము లిందు జేర్పఁబడి ప్రస్తుతము మనకుఁ లభించిన యుదాహరణముగాఁ బరిణమించినది. కావున వీనినుదాహరణల ప్రాచీనరూపములని చెప్పనొప్పును.

త్రిపురాంతకోదాహరణమున నీలక్షణములన్నియుఁ గలవు. కాని యుత్కళికయం దేకసమాసములు లేవు-బసవోదాహరణమున నిట్లుగలదు. ప్రాయశః అనంతుఁడు పాల్కురికి బసవోదాహరణమును జూచి యీలక్షణము రచించియుండవచ్చును-త్రిపురాంతకోదాహరణము తరువాతియుదాహరణమునఁ గూడ నీనియమము పాటింపఁబడి యుండలేదు- తరువాతివారికి త్రిపురాంతకోదాహరణమే వరవడియని తలఁచుట భావ్యము.

ఉదాహరణములు భక్తిప్రశంసాపరములని యీవఱకుఁ జెప్పఁబడినది. త్రిపురాంతకోదాహరణము శివభక్తిప్రతిపాదకము. అయిన నిందు నిరూపింపఁబడిన శివభక్తి వీరశైవమతోద్దిష్టముగాదు. వీరశైవమతసంస్థాపకుఁడగు బసవనకు త్రిపురాంతకుఁడు చాలవెనుకవాఁడైనను నిందు బసవప్రశంసగాని, సమకాలికభక్తవరుల ప్రశంసగాని గానరాదు. జంగమలింగతీర్థప్రసాదాది వీరశైవమతసాంకేతికపదజాల మిందుఁ బ్రయుక్తము గాలేదు. త్రిపురాంతకోదాహరణమునఁ బ్రస్తుతులైన భక్తులు: కన్నప్ప, సేనమరాజు, సాఖ్యతొండఁడు, నంబి, భల్లాహుఁడు, చిఱుతొండఁడు మొదలగువా రందఱు బసవనకుఁ

ప్రాచీనులు. ఇందు భల్లహుఁడుఁ (భల్లాణరాజు) దక్కఁ దక్కి
నవారందఱు నఱువదిమువ్వురు భక్తులచరిత్రమునఁ గలరు
బసవనకుముందు వెలసిన భక్తిప్రధానమగు శివాద్వైతమార్గమే
యిందు నిరూపింపఁబడిన దని చెప్పనొప్పును. మఱియు నిందు
శివోత్కృష్టతనుఁ దెలుపు నర్ధనారీశ్వరత్వము, గంగాధార
ణము, మారసంహారము, దక్షాధ్వరధ్వంసము, కపాలభిక్షాట
నము, త్రిపురాసురసంహారణము మున్నగు పౌరాణికవిషయ
ములు వీరశైవులకే గాక నందఱకుఁ బరిచితములై యున్న
వియే. కావున నిందు వీరశైవముగాక భక్తిప్రధానమగు శివా
ద్వైతభావమే ప్రతిపాద్యము.

—: త్రిపురాంతకుని కవిత :—

త్రిపురాంతకునికవిత దేశికవిత. దీర్ఘసాంస్కృతికసమా
సభూయిష్ఠమగు మార్గరచనగాక, తెలుఁగుపలుకులతీయఁదన
ముఁ జవిఁజూపుచు తెనుఁగుదనము వెల్లడిసేయుచుండును. జా
ను తెనుఁగున నున్నతభావముల నెంతయేని సులభముగ నిమిడ్చి
యున్నాఁడు. కొలఁదిమాటలలో గొప్పయర్థముఁ గూర్చుటయం
దీతఁడు దిట్టరి. కావున నీతని తెలుఁగుకవితయందు 'భావవీథులఁ
గలసి పలుకులఁబట్టిచెప్పఁగరాని చక్కటి, యూఱురేకులమంత్ర
కుసుమమునందు వ్రైడు చంచరీకమై' నది. 'వెన్నునకు నలు
వకును వెనుకదవ్వగువాఁడు, కూటికి, కూరకు, భక్తులకూరి
మికొడుకుల నడిగెడువెడజోగి' యైనాఁడు. అంబరాదితత్త్వము

లకు నవలయైనవేఁడు, కొఱలినదయ బాణాసురుమోసల కూరిమిఁగాచిన ఫణిహారి'యైనాఁడు. వాచవిలోనుగా నొడలి వాకిళులంబొడసూపు తీపులంద్రోచి, శివార్చనానియతితో వెలిచూడక, లోచూపులఁ గుమారాచలనాథునందుఁ జేర్పు గూర్పుఁ గూరిచినాఁడు త్రిపురాంతకుఁడు. కావుననే త్రిపురాంతకోదాహరణమునుఁ గూర్చియు నీతనిఁ గవితనుఁ గూర్చియు విద్వాంసు లీక్రిందివిధముగఁ బ్రశంసించియున్నారు.

"దీని (త్రిపురాంతకోదాహరణము) లోని యద్వైత మార్గము సులభముగాఁ దెలుఁగుపదములతోనున్నది. భక్తి ప్రధానముగాఁ దెనుఁగునఁ బెక్కుకృతులు లేవు. దీనిశబ్దార్థ మాధుర్యమునకు మెచ్చి చిన్నదైనను నీకృతిరత్నమును బండితులు కంఠాలంకారముగా వహింతు రని.........లోకమునకిచ్చితిని." "భాషలోఁ గొన్నియుదాహరణములే గలవు. వానిలోనెల్ల నిది మేలైనది."

మారామకృష్ణకవి - ప్రథమముద్రణపీఠిక.

'త్రిపురాంతకుఁ డాంధ్రకవీశ్వరులలో నిరుపమానుఁడు. దొరకినంతవఱకుఁ బరిశీలింప నీతనికవిత యతిప్రశస్తమని తలంపఁదగియున్నది.'

ప్రభాకరశాస్త్రి : 'క్రీడాభిరామము' పీఠిక.

'త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము బసవోదాహరణముకంటె తర్వాతిదైనను హృద్యతరము.'

ప్రభాకరశాస్త్రి : బసవోదాహరణపీఠిక.

'త్రిపురాంతకోదాహరణము' మృదుమధుర శైలిగలమంచికావ్యము.

వంగూరి సుబ్బారావు : శతకవులచరిత్ర.

ఇప్పటివారలేల! కవితావిషయమున గండరమిండఁడైన శ్రీనాథుఁడే, తిప్పరాజు 'నన్నయ, భట్టు, తిక్కకవి నాయకుఁడన్న హుళిక్కి భాస్కరుండన్నను చిమ్మపూఁడి యమరాధిపుఁడన్నను సత్కవీశ్వరుల్ నెన్నుదుటన్ కరాంజలులు జే యనినింతురు ! రావిపాటి తిప్పన్నయు నంతవాఁడ'యని ప్రశంసించినాఁడు.

సుధానగ్రంథలక్షణగ్రంథోదాహృతులు.

1. కొక్కోకమును నాంధ్రీకరించిన ఎఱ్ఱన త్రిపురాంతకునిట్లు ప్రశంసించినాఁడు.

గీ. ముని సనత్కుమారు ధనదతనూభవు
నాశ్వినుల జయంతు నభినుతింతుఁ
బృథివి రావిపాటి త్రిపురాంతకాది శృం
గారకవులనెల్ల గారవించి. ౧ ఆ.

ఎఱ్ఱనకొక్కోకమును జగ్గన తన ప్రబంధరత్నాకరమున నుదాహరించి యున్నాఁడు. కావున నీతఁడు క్రీ. శ. 1560 నాఁటికిఁ బూర్వుఁడు.

2. జగ్గన ప్రబంధరత్నాకరమున త్రిపురాంతకోదాహరణమునుండియు నంబికాశతకమునుండియు పద్యము లుదా

హరించి యున్నాఁడు. ఈజగన్నాథకవి గ్రంథమును, నింకొక గ్రంథకర్త సంధానించిన గ్రంథములను సంపుటీకరణముగావించి శ్రీ ప్రభాకరశాస్త్రిలవారు 'ప్రబంధరత్నావళి' యనుపేరఁ బ్రకటించినారు. వారీ గ్రంథసంఘాతలఁ గూర్చి వ్రాసినవాక్యములవలన నాయాసంధాతల కాలనిర్ణయము తేటపడఁగలదు.

"ఇర్వురు సంధాతలును కొంచెమించుమించుగ సమకాలమువారనియే తలంపవచ్చును. మన మెఱింగినంతలో జగన్నాథకవి యుదాహరించిన వారిలో మాదయగారి మల్లయ్యయు, తెనాలి రామలింగయ్యయు, రెండవసంధాత యుదాహరించిన వారిలో నల్లసాని పెద్దనార్యుఁడును నర్వాచీనులు. జగన్నాథునికంటె నిర్వదేండ్లు రెండవసంధాత ప్రాచీనుఁడై యుండవచ్చును." ప్రబంధరత్నావళి. పుట 3.

3. క్రీ. శ. 1656 సంవత్సరమున నప్పకవి తనయప్పకవీయమున నీత్రిపురాంతకోదాహరణములోని చతుర్థీవిభక్తిపద్యమును 'సరిబేసై రిపుడన్న త్రిపురాంతకునిపై చాటుధారను ననుస్వారసంబంధయతి కుదాహరణముగను నుదాహరించి యున్నాఁడు.

4. క్రీ. శ. 1680 సంవత్సర ప్రాంతమువాఁడును, ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాస గ్రంథకర్తయును, లక్షణవేత్తయునగు గణపవరపు వేంకటకవి తనప్రయోగరత్నాకరమున నంబికాశతకములోని రెండుపద్యము లుదాహరించియున్నాఁడు.

5. క్రీ. శ. 1750 కవిసార్వభౌమబిరుదాంకితుఁడును బహుప్రబంధ రచయితయునగు కూచిమంచితిమ్మకవి తనసర్వ లక్షణసారసంగ్రహమున రేఫ - ఱకారప్రకరణమున పై 'ఆ ఱడి యూస' అనుపద్యము నుదాహరించియున్నాఁడు.

పై వాని ననుసరించిచూడ నిక్కవి భాషాభిజ్ఞులకుఁ గ్రొత్తవాఁడు గాఁడనియు, నీతని గ్రంథములు లఘుకృతులైన ను లక్ష్యలక్షణగ్రంథములయం దుదాహరణముగాఁ గొనుటచే నీకవి ప్రాచీనాంధ్రకవులలో సుప్రసిద్ధుఁ డని తెలియఁదగి యున్నది.

---

# ఉదాహరణగ్రంథములు.

## (1) బసవోదాహరణము.

ఆంధ్రవాఙ్మయమున మన కుపలబ్ధము లగునుదాహరణములలో బసవోదాహరణము మొదటిది. పూర్వలాక్షణిక శైవకవిసార్వభౌముఁడు పాల్కురికి సోమనాథుఁడు దీనిని రచియించినాఁడు. సోమనాథుఁడు తెలుఁగుననే కాక సంస్కృతమునఁ గూడ నుదాహరణమును రచియించెను. తెలుఁగుబసవోదాహరణమును మాఘము భారతియందు ప్రభవసంవత్సరము బ్రహ్మశ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించినారు. సంస్కృతమునఁ గల యుదాహరణ మముద్రితము. ఈయుదాహరణము క్రీ. శ. 1220 ప్రాంతముది కావచ్చును.

## (2) త్రిపురాంతకోదాహరణము.

కాలక్రమమున ద్వితీయ మయ్యును, కవితాప్రకర్షయందద్వితీయ మగునీయుదాహరణము రావిపాటి త్రిపురాంతక మహాకవి ప్రణీతము. దీనిమాతృక తంజావూరు శరభోజీ సరస్వతీ భవనగ్రంథభాండాగారమునఁ గలదు. క్రీ. శ. 1912 వ సంవత్సరమున మానవల్లి రామకృష్ణకవిగారు దీనిని ముద్రించినారు. కవిగారే తిరిగి దీనిని 1933 వ సంవత్సరము ఏప్రిలు నెలలో 'తిరుమలశ్రీవేంకటేశ్వరపత్రిక' (I సంపు. 9 సం.) యందుఁ బ్రకటించియున్నారు. నేనీయుదాహరణమును మూఁడవతూరి ప్రకటించినాను. ఈయుదాహరణకాలము. క్రీ. శ. 1370 సంవత్సరప్రాంతము.

(3) వేంకటేశ్వరోదాహరణము.

శ్రీతిరుపతిక్షేత్రమున సంకీర్తనాచార్యులై మహాప్రఖ్యాతిని వహించిన తాళ్ళపాకవారిలోని పెదతిరుమలయ్యగారీయుదాహరణమును రచియించినారు. ఇయ్యది పైనుదాహరించిన 'తిరుమలశ్రీవేంకటేశ్వరపత్రిక'యందు సప్తమసంచికయందు మా. రామకృష్ణకవిగారిచేఁ బ్రకటితమైనది. ఈయుదాహరణము క్రీ. శ. 1530 ప్రాంతమున రచియింపఁబడియుండును.

(4) హనుమదుదాహరణము.

లక్షణసారసంగ్రహమును రచియించిన చిత్రకవిపెద్దన తన లక్షణగ్రంథమునం దుదాహరణలక్షణమును జెప్పి దానికి లక్ష్యముగా హనుమంతునిపరముగా నొకయుదాహరణమును రచియించియున్నాఁడు. ప్రస్తుతము పరిషత్పత్రికయందుఁ బ్రకటితమగుచున్నలక్షణసారసంగ్రహమునందు ద్వితీయాశ్వాసమున నుండుటచే నీయుదాహరణ మనతికాలములోనే ముద్రణభాగ్యమునందును. ఈయుదాహరణకాలము క్రీ.శ. 1560 ప్రాంతము.

(5) శ్రీకృష్ణోదాహరణము.

అప్పకవి తన 'అప్పకవీయము' (4 ఆ.) నుదాహరణమునుం జెప్పుచు లక్ష్యముగా శ్రీకృష్ణునిపరముగా నీయుదాహరణము రచియించియున్నాఁడు. అప్పకవికాలము సునిశ్చితమైనదే. ఈయుదాహరణము క్రీ. శ. 1656 సంవత్సరమున రచియింపఁబడినది.

## (6) శేషార్యోదాహరణము.

శ్రీవల్లండిగళు వంశజుఁడైన శేషార్యుని ప్రశస్తిని వర్ణించుచు, బాలకవి యనంతయ్య రచియించినది. ఇది యముద్రితము. ఈ శేషార్యుఁడు మధురనాయకుఁడగు విజయరంగచొక్కనాథుని యమాత్యుఁడగుటచేఁ గవియు నాకాలపువాఁడే. విజయరంగ చొక్కనాథుఁడు క్రీ. శ.1704 మొదలు క్రీ. శ. 1730 వఱకుఁ బరిపాలించినవాఁడు. శేషోదాహరణము క్రీ. శ. 1720 సంవత్సర ప్రాంతముల రచియింపఁబడి యుండవచ్చును.

## (7) విశ్వేశ్వరోదాహరణము.

ఏనుఁగు లక్ష్మణకవి విశ్వేశ్వరోదాహరణము రచియించినట్లాతని భర్తృహరి-యాంధ్రీకరణమువలనఁ దెలియుచున్నది. కాని యీయుదాహరణము లభ్యము కాలేదు. దీని రచనాకాలము క్రీ. శ. 1780 ప్రాంతము.

## (8) ముఖలింగేశ్వరోదాహరణము.

నలువదేండ్లక్రిందట కళింగదేశాంతర్గత జలుమూరువాస్తవ్యుఁడు మచ్చ వేంకటకవి ముఖలింగేశ్వరుని పేర నుదాహరణము రచియించినాఁడు. ఇయ్యది యాకాలమున ముద్రింపఁబడినది. శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనముగ 'మశచరిత్రము'ను రచియించుటవలనను నాగ్రంథ మముద్రితగ్రంథచింతామణియందుఁ బ్రకటింపఁ బడుటచేతను నీతఁడు ప్రసిద్ధిఁ జెందెను. రచనాకాలము 1896.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (25 సం॥ 3 సంచిక.)

పుదుక్కోటరాజగు విజయరఘునాథుని కంకితముగా నాంధ్రభాషార్ణవ కర్త నుదురుపాటి వేంకనార్యుని మనుమఁడు సాంబశివకవి యొక యుదాహరణము రచియించినాఁడు. అది చాటుపద్యరత్నాకరమున కొంత ముద్రింపఁబడినది.

క్రీ. శ. 1810 దీనిరచనాకాలము.

సంస్కృతమున సార్వవిభక్తికముగా శ్లోకములుండుట క్వాచిత్కముగఁ గానవచ్చుచున్నది.

కృష్ణో రక్షతు నోజగత్త్రయగురుఃకృష్ణం నమస్యామ్యహమ్
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మైనమః
కృష్ణాదేవ సముత్థితంజగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహమ్
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణ! రక్షస్వమామ్.

ముకుందమాల - కులశేఖరాళ్వారు.

సంస్కృతమున రగడలకునంతగాఁ బ్రచారము లేదనుటకు నొక యుదాహరణముఁ జూపుచున్నాఁడను. సోమదేవుని యశస్తిలకచంపువు. 1916 సంవత్సరమున నిర్ణయసాగర ముద్రాలయమున ముద్రితమైనది. అందలి 15-16 పుటలయందొక రగడభేదము వచనముగా ముద్రింపఁబడినది.

'వికచకర్ణోత్పలస్ఫురితరక్షేక్షణాః కేళితాళకక్వణత్కనకమయకంకణాః సరసనఖరాజి విచ్ఛురిత భుజమండలాః కాంచికోల్లాస వశదర్శితోరుస్థలాః స్వైరసంజల్పనస్మేరబింబాధరాః కర్ణకండూమిషోద్వలిత కక్షాంతరాః పృథునితంబస్ఖలల్లటహాగతి విక్రమాః సహజశృంగార రసభరిత ముఖవిభ్రమాః.

పై వచనమును

వికచకర్ణోత్పలస్పర్ధితరళేక్షణాః
కేళితాళకక్వణత్కనకిమయకంకణాః
సరస నఖరాజి విచ్ఛురితభుజమండలాః
కాంచికోల్లాస వశదర్శితోరుస్థలాః
స్వైర సంజల్పన స్మేర బింబాధరాః
కర్ణకండూమిషోద్వలితకణ్ఠాంతరాః
పృథునితంబ స్థలల్లటహాగతి విక్రమాః
సహజశృంగార రసభరితముఖ విభ్రమాః

ఇట్లు ముద్రించిన నిది రగడభేదముగా నేర్పడుచున్నది. ఇది తెలుఁగున ద్విరదగతి రగడకు సరిపోవుచున్నది. మఱియు నిందు తెలుఁగునవలె రెండేసిపాదముల కనుప్రాసము పాటింపఁబడినది. ఇంకను మాత్రాగణనిబద్ధములగునవి యశస్తిలక చంపువున గలవు. దానివ్యాఖ్యాత శ్రుతసాగరుడు వీని వ్యాకరించుపట్ల నేమియుఁ దెలుపక యట్లే విడిచినాఁడు. ఈగ్రంథ పరిష్కరణము గావించినవారికి నీఛందస్సంప్రదాయముఁ దెలియక పై విధముగ వచనముగా ముద్రించినారు. రగడలు దేశీయచ్ఛందస్సునకు సంబంధించినవి. సంస్కృతము వీనికంతగాఁ బ్రచారము లేదనుటకుఁ బైయుదాహరణముఁ జూపితిని. దేశీయచ్ఛందోపరిశీలనమున నాంధ్రచ్ఛందస్సు ప్రత్యేకత గోచరింపఁ గలదు.

# పాఠభేదవిమర్శనము.

శ్రీరామకృష్ణకవిగారు తొలికూర్చిన సీగ్రంథమునకు మాతృక యెచ్చటలభ్యమగునది తెలియపరుపలేను. నేఁడు తంజాపురగ్రంథాలయమునఁ గల ప్రతియే. దీనికి మాతృకయని విజ్ఞులు తలఁచుచున్నారు. దీనిని క్రీ శ. 1912 లోఁ గవిగారు ప్రకటించినను, నంతకుమున్ను వారీగ్రంథము నెఱుఁగుదురు. క్రీ. శ. 1909 వ సంవత్సరమున వారు ప్రకటించిన నన్నెచోడని కుమారసంభవము ప్రథమభాగమున నీగ్రంథమును నుదాహరించియే యున్నారు. వ్రాఁతప్రతులయందు నచ్చుప్రతులందును గల భేదముల గ్రంథమం దచ్చట సూచించియే యున్నాఁడను. అయిన కొన్నిపట్టుల నర్థము కుదురుపడలేదు. తృతీయావిభక్తి యుత్కళికయందు 'ఏసియున్న జోదుచేత, దాసవరగణాద్యచేత' అని కలదు. ఈపాఠమున ననుప్రాసము పాటింపఁబడలేదు. 'గణాదుచేత' అని యుండఁదగును. అప్పుడు ప్రమథగణముల కాదియగువాఁడను నర్థమేర్పడును. అయిన నేను పరిశోధించిన వానియందెల్ల నిట్లుండుటచే నారీతినే ముద్రించితిని. షష్ఠీవిభక్తి కళికయందు 'మెఱయు దొట్టముట్టి ముట్టుమేఁటిసీటితీరమునకు' అను రగడ పాదమున కర్థము కుదురలేదు. మెఱయుఁ దట్టముట్టె ముట్టుమేఁటితీరమునకు' అనినచోఁ గొంతవఱకుఁ గుదిరికగలుగును. మెఱయుదట్టయనఁగా బడబాగ్ని ఆముట్టె నుండి వెడలినదే మేఁటినీరు. సముద్రము. ఆమేఁటినీటితీరమనఁగ నాయనంతజలధికి తీరముఁబోలిన వాఁడని యర్థముచెప్పవలెను.

'మెఱయుఁ దోట్టుముట్టు ముట్టు మేఁటిసిరితీరమునకు' అని మార్చినచో నింకొకయర్థ మేర్పడును. 'తోట్టుముట్టు' అనగా తొలిసాధనము. పృథివ్యాపస్తేజోవాయురాకాశములఁ దొలి యగునది భూమి, దానిఁ ముట్టినది మేఁటిసిరి. సముద్రము భూమ్యంతమును ముట్టియుండును. ఆసముద్రాంతమునకుఁ దీర మైనవాఁడనఁగ వేలావనికి హద్దయినవాఁడను నర్థము గలుగు చున్నది. ఇవి యూహామాత్రములే. కవిహృదయముఁ దెలిసి కొనుట కష్టము. ప్రాచీనగ్రంథపరిష్కరణమున మనకు గహనమగు పాఠములను నిచ్చవచ్చినట్లు మార్పుచేయకయున్న వాని నట్లే యుంచుట మంచిది. ఆపైవిచర్చలవలన నిర్ధారిత మగువానిఁ జేర్చుట సమంజసము. ఈషష్ఠివిభక్తి యుత్కళిక యందే

"బాలలీలఁ జూడఁజూడ
సోలిలీలఁ గ్రీడలాడ
నాదినాథ జనకమునకు
వాదపూరి కనకమునకు"

అని గలదు. ఇందు క్రీడలాడ అనుచో క్రీడలాడు' అని క్రియసమాపకముగా నుండఁదగును. అట్లయినను ప్రాసము కుదురలేదు. బాలలీలఁజూడఁ జూడు సోలిలీలఁ గ్రీడలాడునని యుండిన రెండును తరువాతిపాదమునఁగల జనకమునకు కనక మునకు క్రియావిశేషణము లగును. సంబోధనయందు.

తాపసుల యీాలువుల తనరు తపములవంట చూపు లకు నెల్ల పరమసుఖవార్ధి పెన్నింట అని కలదు. ఇచ్చట పెన్నింట అనురూపమునకు నేఁడు 'పెన్నిట్ట' అని గలదు. నిట్టయనఁగ వెల్లువ. పెన్నిట్టయనఁ బెద్దవెల్లువ. నిట్టపొడిచె అనఁగ వెల్లువ యై పొంగిపొరలెనని యర్థము. పైపాదాంతమున 'పెన్నిట్ట' అని మార్చినను ప్రాసమునకు భంగము గలుగును. కావున నట్లే యుంచితిని.

అనుప్రాసముల యుపయోగ మిట్టిపట్టుల తెలియఁ గలదు. —:వ్యాకరణచ్ఛందోవిశేషములు:—

త్రిపురాంతకోదాహరణమున రేఫఱకారములు చక్కఁగ పాటింపఁబడినవి. నన్నయనాఁటికి వీనివైజాత్యము సడలినను, నాంధ్రభాషాతత్త్వవివేచనమునకు వీనిస్వరూపస్వభావము లెంతయేని తోడ్పడుచున్నవి. అప్పకవి రేఫఱకార నిర్ణాయకవిమయమునే నీయుదాహరణము నుదాహరించియున్నాఁడు. మఱియు 'లోకము లిండ్లువాకిళుల్' అనుచో షష్ఠీసమాసమున సంధివచ్చుటకు నన్నచోడని కుమారసంభవమున 'దేహేంద్రియము లిచ్చ లేలసలుపు' అనియు హారిశ్చంద్రోపాఖ్యానమున 'అన్నపూర్ణ విశాలాక్షు లాటపట్టుల' అని ప్రయోగములు గలవు.

ఇందుపయోగింపఁబడిన రగడలు వైతాళీయభేదములని యప్పకవి చెప్పినాడు. ప్రాచీనచ్ఛందస్సులలో దీని కాధారము గానరాదు. రగడలో ననంతుడు చెప్పినవా నికి నప్పకవి చెప్పిన

వానికి నడకలో భేదము గలదు. గ్రంథవిస్తరభీతి నాచర్చ చేయఁ జాలనైతిని. ఇట్లే విభక్తిప్రత్యయనిరూపణమునఁ జర్చింపఁదగు విషయములు పెక్కులు. కావ్యాలంకారచూడామణియందుఁ బెద్దన, చతుర్థీవిభక్తి 'కొఱకు' నామాంతరమని చెప్పినాఁడు గాని విభక్తులఁ జెప్పుచోఁ బ్రత్యయముగా నీయలేదు. ఇట్లే ఛందోవిషయమున జాతులఁగూర్చి,

"మాత్రాగణ రచనలకుం
బాత్రములై నెగడి యాంధ్రభాషాకవితా
మిత్రములై రసభావా
మత్రములై జాతులెఱుఁగ మంచిదికృతులన్"

అని ప్రశంసించియు, జాతు లుపయోగింపఁబడిన చాటుకృతులు మెప్పుఁ బొందవని యందే చెప్పియున్నాఁడు. నరసభూపాలీయమునం దుదాహరణముఁ గూర్చినది పైప్రతాపరుద్రీయోదాహృతలక్షణమునకు నాంధ్రానువాదమే. ఇందును నిది క్షుద్రకావ్యములలోఁ జేర్పఁబడినది. ఆంధ్రాలంకారికుల యభిప్రాయము లిట్టివి. ఇవివిమర్శాపేక్షితములు - శాఖోపశాఖలుగా విరాజిల్లిన యాంధ్రవాఙ్మయవృక్షమున నీయుదాహరణశాఖ నష్టప్రాయమైనను జాతీయవాఙ్మయ పరిశోధనమునకుఁ బద్యచ్ఛందోపరిశీలనమునకును దోహదము గలిగించునని యీయుదాహరణముఁ బ్రకటించితిని. విచక్షణులు మేలేర్చికొందురు గాత !

కాకినాడ,
2-7-37.

నిడుదవోలు వేంకటరావు, బి. ఏ.

# త్రిపురాంతకోదాహరణము.



## ప్రథమావిభక్తి.

ఉ. శ్రీనగచక్రవర్తితుదిశృంగము చూచెదనంచు నేటికిం
బోననిశంబు మానవులు! [1]పుట్టువుం జావును లేమిమాను నా
చే ననుచుం బతాక యనుచేఁ దరుణాచల మెక్కి [2]చీఱు వం
చాననుఁ డిందుమౌళి త్రిపురాంతకదేవుఁడు భక్తలోకమున్.

కళిక - వృషభగతిరగడ.

మఱియు సజ్జనభక్తగృహముల మరగి తిరిగెడికామధేనువు
కఱద లెఱుఁగక వేఁడుదీనులఁ గదియుజంగమరత్నసానువు
శైలజాముఖచంద్రరోచులఁ జవులఁ దవిలెడునవచకోరము
వేలుపుందపసులతలంపుల వెల్లిగొల్పెడు నమృతపూరము
[3]దేవతలు మువ్వురకు నవ్వలి దెస వెలుంగుచునుండు నెక్కటి
భావవీథులఁ గలిసి పలుకులఁ బట్టి చెప్పఁగరాని చక్కటి
ఆఱు రేకులమంత్రకుసుమమునందు వెలిఁగెడుచంచరీకము
వేఱుసేయక యోగిజనములు వెదకిపొందెడు [4]నూర్ధ్వలోకము

1. అనిశంబు నుండు నిదె- అని వ్రాఁతపుస్తకము.
2. చేరు- వ్రాఁతపుస్తకము.
3. దేవతలకు- ముద్రితపుస్తకములు.
4. పొందెడి- ముద్రితపుస్తకములు.

## ఉత్కళిక.

అడుగుఁదమ్ములఁ జొప్పు వసి గని
యడరి శునకాకృతులు గైకొని
మీఁటిచదువులు దవుల ముందటఁ
బాఱుక్రోడము నేసి మందట
లాడి తను మార్కొనఁగవచ్చిన
క్రీడి కోరినవరము లిచ్చిన
యాటవికకులసార్వభౌముఁడు
జూట భాస్వత్తుహినధాముఁడు-

## పద్యవివరణము.

భారతవర్షమున ద్వాదశజ్యోతిర్లింగములయందుఁ[1] దెలుఁగుదేశమునఁ జిరప్రఖ్యాతిఁ గన్నశ్రీశైలమునకు నాలుగుదెసలను నాలుగువాకిళ్లు గలవు. వానికిఁ దూర్పున త్రిపురాంత

---

1. ద్వాదశజ్యోతిర్లింగములు:—(1) సౌరాష్ట్రమున సోమనాథుఁడు, (2) శ్రీశైలమున మల్లికార్జునుఁడు, (3) ఉజ్జయిని మహాకాలుఁడు, (4) అమరేశ్వరము ఓంకారేశ్వరుఁడు, (5) వారేల్యమున వైద్యనాథుఁడు, (6) దారుక నాగనాథుఁడు, (7) వారణాసి విశ్వేశ్వరుఁడు, (8) దాక్షారామము భీమేశ్వరుఁడు, (9) రామేశ్వరమున రామలింగేశ్వరుఁడు, (10) హిమాలయమున కేదారేశుఁడు, (11) నాసిక త్ర్యంబకేశ్వరుఁడు, (12) ఏలాపురి ధిమణేశ్వరుఁడు.

ఈద్వాదశజ్యోతిర్లింగములఁ గూర్చినప్రశంస
భారతి, రక్తాక్షి, ఫాల్గునము, 'మార్చి 1925' లోఁ గనఁదగును.

కము; పడమట బ్రహ్మేశ్వరము (అలంపురి); ఉత్తరమున మాహేశ్వరము; దక్షిణమున సిద్ధవటము నని పేరులు. ఈనాలుగువాకిళ్లకు, త్రిపురాంతకుఁడు, బ్రహ్మేశ్వరుఁడు, మాహేశ్వరుఁడు, సిద్ధవటేశ్వరుఁడు నను వా రధినేతలు. అందు, తూర్పువాకిలి త్రిపురాంతకమున కధినాథుఁ డగుత్రిపురాంతకదేవునిపై నీయుదాహరణము త్రిపురాంతకమహాకవిచే రచియింపఁబడినది. కావున నీగ్రంథమునకుఁ త్రిపురాంతకోదాహరణ మనుపేరు గలిగినది.

తరుణాచల మనఁ గుమారగిరి. త్రిపురాంతకమునొద్ద పర్వతభాగమునకుఁ గుమారగిరి యనిపేరు. ఈకుమారాద్రికిఁ దూర్పుదెసను రెంటాల మల్లినాథుఁ డనుభక్తుఁడు పంద్రెండవ శతాబ్దమున సోపానములఁ గట్టించెను. ఈతఁడు పాల్కురికి సోమనాథుని సమకాలికుఁడు. (చూ. బసవపురాణావతారిక-పుట 3).

పద్యమునఁ బంచాననశబ్దమును కవి బహుళార్థస్ఫోరకముగ నుపయోగించినాఁడు. పైని వివరించిన నాలుగువాకిండ్ల యధినేతలును, నాదిశృంగ మగుశ్రీశైలాధీశ్వరుఁడు మల్లికార్జున స్వయంభూలింగమూర్తియు నీశ్వరుని పంచముఖములనుండి యుద్భవించినట్లు పండితారాధ్యచరిత్రమున నిట్లు గలదు:—

అద్భుతలీల నయ్యైస్థానములు స
ముద్భవం బయ్యె లింగోపకంఠమున

మఱియు 'శ్రీనగచక్రవర్తి' యని పలుచోట్ల పండితారాధ్యచరిత్రమునఁ గలదు. కావుననే త్రిపురాంతకుఁడు శ్రీనగచక్రవర్తి యని మొదలిడినాఁడు. దేవాలయమున నాయాదైవతచిహ్నము లగుపతాక లుండుటయు, పతాకలు రాజలాంఛనము గావునను నిందు చక్రవర్తిపదము సార్థకమే యగుచున్నది. చీఱు- ఇది శకటరేఫము- చీరు ననుసాధురేఫరూపమున రెండుగాఁ జేయు ననుసరము.

కళికవివరణము.

కఱదలు=బుద్ధులు.
ఎక్కటి=ఏకికుఁడు- సంస్కృతము ఏకః- ఇచ్చట మహాదరకము.

ఇది మహాదమహాదర్థములందును మహాత్మ్యార్థమునందునుఁ బ్రయోగింపఁబడును.

ఆఱురేకులమంత్రకుసుమము. ఓంకారముతోఁ గూడిన పంచాక్షరికి షడక్షరి యని పేరు * మంత్రకుసుమమున బీజాక్ష

*ఓంకారపూర్వో మంత్రోఽయం పంచాక్షరమయం పరః
శైవాగమేషు వేదేషు షడక్షరి ఇతి స్మృతః. సిద్ధాంతశిఖామణి.
ప్రణుతింపఁ బంచాక్షరములకు మొదలఁ
బ్రణవమొంద షడక్షరంబు నాఁ బరఁగు. దీక్షాబోధ-ద్వితీయాశ్వాసము.
ప్రథమముద్రణమునందు, ఆఱురేకులమంత్ర మన మూలాధార స్వాధిష్ఠాన మణిపూర కానాహత శుద్ధసహస్రారబ్రహ్మరంధ్రము లని వ్రాయఁబడి ద్వితీయముద్రణమున నాఱురేకులమంత్ర మనఁ బ్రణవాక్షరపూర్వక మగు పంచాక్షరి యని వ్రాయఁబడియున్నది. ఇందు, తొలియర్థము తాంత్రికసంప్రదాయము. రెండవది శైవసంప్రదాయము. ఈసంప్రదాయములు రెండును సోమనాథభాష్యమునను, వీరశైవాష్టావరణప్రమాణాష్టకాభరణమునను వివరింపఁబడి యున్నది. శైవాగమములు శివలింగ మీషడక్షరీమంత్రరూప మని తెలుపుచున్నవి.

రములు రేకులుగా మంత్రాధిదైవతముసుమ్మెదగాఁ బోల్చు భావము త్రిపురాంతకమహాకవికిఁ బూర్వమునుండియుఁ బ్రచారములో నున్న 'తుమ్మెద'పదములలోఁ గలదు.

తుమ్మెదపదములు పంద్రెండవశతాబ్దమునఁ బ్రచారములోనున్నట్లు పండితారాధ్యచరిత్రమువలనఁ దెలియవచ్చును.

"పదములు తుమ్మెదపదము ల్ప్రభావ
పదములు పర్వతపదము లానంద
పదములు శంకరపదముల్ నివాళి
పదములు తాలేసుపదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు"

ప. చ. వా. ప్ర 173 పుట.

ఆఱు- సంఖ్యావాచకమునను దీపమాఱుట మొదలగు క్రియావాచకములయందును శకటరేఫము. నిండారు, పెంపారు మొదలగు శబ్దపల్లవములయందు సాధురేఫము.

ఉత్కళికావివరణము.

ఉత్కళిక సుప్రసిద్ధ మగుకిరాతార్జునకథాసూచకము. పరమేశ్వరుఁ డర్జునునకు పాశుపతము నొసఁగుసందర్భమునఁ గిరాతవేషమును దాల్చుటయు నందు,వేదములు శునకము లగుటయు శైవగ్రంథములయందు పలుచోట్ల వర్ణింపఁబడినది. పండితారాధ్యచరిత్రమున నీయవతారలీల పదునైదవదిగా వర్ణింపఁబడినది. ఈలీలలు సాంఖ్యమతానుసారముగ నిరువదియైదు

తత్త్వముల కిరువదియైదు లీలలు పాల్కురికి సోమనాథుఁడు వివరించినాఁడు. నిశ్శంక కొమ్మన శివలీలావిలాసమున, శైవసంప్రదాయానుసరణముగ ముప్పదియాఱుతత్త్వములకు ముప్పదియాఱులీలలు వివరించినాఁడు. కేవల రౌద్రాకారుఁడును, సంహారమూర్తియు నగురుద్రుని దయామయత్వమును విశదీకరించు నీలీల ప్రాచీనకాలమునుండియుఁ గవులమనంబులు చూఱగొని శైవభక్తిస్థిరీకరణమునకుఁ గారణ మైనది. భారవికిరాతార్జునకథ యందు దెలిపెంగినదియే.

---

## ద్వితీయావిభక్తి.

ఉ. పామునుహారమున్ నెలయుఁ గొబాపటసేసయు[5] నేఱు మల్లికా
దామముతోలుదువ్వలువుగొదట్టపు భూతియుఁ జందనంబు మై
సామున నాలు[6]నందముగ సన్నిధిసేసినఁ జూడఁగంటి నే
నామదిలోఁ గుమారగిరినాథుని శైలసుతాధినాథునిన్.

కళిక - విజయభద్రరగడ.

మఱియు వేలుపుటేటి కొమాళి నాఁగినవాని
నెఱయఁ గన్నుపనోటి నీటఁ దోఁగినవానిఁ
బొలఁతితో నొక్కొడలఁ బొత్తుఁగూడినవానిఁ
దలఁకి సేనమరాజు చాడి కోడినవాని
సాఖ్యతొండని రాలజడికి నోర్చినవాని

---

5. బొట్టు- ముద్రితపుస్తకము.

6. సామునఁ జాల- ముద్రితపుస్తకము.

సౌఖ్యతరసాయుజ్యసరణిఁ దీర్చినవాని
వెన్నెలలఁ బురుణించు వెలఁదినవ్వులవాని
వెన్నునకు నలువకును వెదుక దవ్వగువాని.

ఉత్కళిక.

చిగురుఁగైదువు వెఱికి
మగలసిగ్గులు నఱికి
సతులఁ బాటులుపఱచి
యతుల వ్రతములు చెఱచి
అలులు చిలుకలు బండు
లెలయఁ గొలువఁగ నుండు
మరు జయించినవానిఁ
గరుణ మించినవాని.

పద్యవివరణము.

అచ్చులోనున్న 'బొట్టు' అనుపాఠముకన్న 'సేస' యను పాఠము శ్రేష్ఠము. జగ్గనప్రబంధరత్నాకరమున నుదాహరించిన యీపద్యమున 'సేస'యనుపాఠమే గ్రహించియున్నాఁడు. చంద్రుఁ డీశ్వరునికి శిరోభూషణ మైనను, నర్ధనారీశ్వరుఁ డైనపుడు చంద్రఖండము 'సేస' వలె సీమంతమున నుండును. మైసామున'జాల' అని ముద్రణపుఁబ్రతులలోను వ్రాఁతప్రతియందును గలదు. 'అలు' అనుపాఠము నర్థస్ఫురణ గల్గించును. ఇం దర్ధనారీశ్వరత్వము ధ్వనితము.

దువ్వలువు- రెండువలువలు- వలువు ప్రాచీనరూపము. (దుగ+వలువు)- వస్త్రములు సాధారణముగ రెండు గాని యొకటి నిచ్చు నాచారము లేదు. కట్టునాచారమును లేదు. ఈశ్వరుఁడు గజాసురుని వధించి యాచర్మమును బట్టగాఁ గైకొనినాఁడు. కావుననే కృత్తివాసుఁడు.

కళికవివరణము.

1. ఈశ్వరుఁడు గంగను ధరించినకథ శివపురాణప్రసిద్ధమే.
2. కన్నప్ప యనుశివభక్తుఁడు తనపుక్కిటనీటితో శివు నభిషేకించి సాయుజ్యమునుఁబొందినకథ బసవపురాణమునఁగలను. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యకథలోఁ గూడఁ గలదు. (తృ. ఆ.)
3. సేనమరాజు- చేరమచక్రవర్తి ...మహాగోముఁ డనినామాంతరము- శైవభక్తుఁడు.
4. సాఖ్యతొండము- ఈభక్తుఁడు శాక్యుఁ డగుటచే శాక్యతొండఁ డనియుండుట సరి. బసవపురాణమున సాంఖ్య

---

బౌద్ధదంపతులకుఁ బుట్టిన శాఖ్యతొండఁడు శివభక్తిపరుఁడై శివాలయమున ముప్పూటలు మూఁడుతాలతో శివపూజసేయుచుండ నొకతటి నేడురోజులు వర్షము గురియుటచే నాలయమునకుఁ బోవీలులేక నుపవాసముండి యేడవనాఁడు వాఁడొకతాయియు దొరకకపోవుటచే నొకపెద్దబండ నెత్తి శివునిఁబూజించెను. శివుఁడు ప్రత్యక్షుఁడై సాయుజ్య మిచ్చెను.

అఁగుట=అపుట.

వెలఁదినవ్వు=తెల్లనినవ్వు.

నలువ (నలు+వాయి)=నాలుగునోళ్లు గలవాఁడు.

ఉత్కళికయందు మారసంహారము వర్ణింపఁబడినది.

తొండఁ డని కలదు. ఈతనికథ యందు షష్ఠాశ్వాసమున వర్ణితము. త్రిపురాంతకుఁడు ప్రాసస్థానమున నీపదము సౌఖ్య యనుదానితోఁ గుఱుతుపఱచుటచే నిదియే సాధురూపముగా నెన్నఁదగినది.

---

## తృతీయావిభక్తి.

ఉ. ప్రాలి నటించు ముక్తివరవర్ణినిపయ్యెదకొంగు చాడ్పునం
గ్రాలునిజాంకపుంబడగఁగన్నులఁ జూచినఁ జాలు, నిమ్నగా
స్ఫాలితమౌళిచేతఁ, బురభంజనుచేతఁ గుమారపర్వతం
బేలెడురాజుచేత ఫలియించు జనావళికోరుకోరికల్.

కళిక - (హయప్రచారము లేక తురగవల్గనరగడ).

మఱియు మన్త్రమౌని మొదలమఱగి యున్న గురునిచేత
గౌఱలి తాపసులకు నెఱుకఁగొలుపు జటిలవరునిచేత
నంబి వనుప కుంటెనలకు నడచిన నెడకానిచేత
నంబరాదితత్త్వములకు నవలనైన వేనిచేత
బల్లహునివధూటి కాసపడిన దుండగీనిచేత
[1]నల్లయలక యేలురాజుననుఁగుసంగడీనిచేత

---

1. అల్ల=తత్రార్థకము- ప్రసిద్ధమే.
ఇల్ల=అత్రార్థకము. ఇల్ల కప్పుడి సంగమేశ్వరంబందు.
బ. పు. ప్ర. ఆ. 24 పుట.
ఉల్ల=సమీపప్రదేశార్థకము- ఉల్లతురగోత్తము వాలంబు,
నన్నయ. భా. ఆ.
ఎల్ల=కుత్రార్థకము. తెలుఁగున ఎల్లసర్వార్థకమున వాడుక. కుత్రార్థకమునఁ బ్రయోగము లేదు.

భూతిపూయు మానవులకుఁ బుట్టుమాన్పు వైద్యుచేతఁ
బ్రీతి ధాతపునుక కోరఁ భిక్ష సేయునాద్యుచేత.

ఉత్కళిక.

ఇల రథంబులీల నొప్ప
నలువ నిగమహరుల రొప్పఁ
బూసఁగఁ బాపనారిఁ బట్టి
పసిఁడికొండ నెక్కువెట్టి
దొడఁగి నేలఁ గూలఁ బురము
లేసియున్న జోదుచేత
దాసవరగణాద్యుచేత.

పద్యవివరణము.

ఇందు, దేవాలయము పైపతాక ముక్తికాంతపైఁటతోఁ
బోల్పఁబడినది.

కళికవివరణము.

1. వటవృక్షము దక్షిణామూర్తికి స్థానము. దక్షిణామూర్తిగా
శివుఁ డవతరించుట శివుని యిరువదినాల్గవలీల.

దక్షిణామూర్తివై ధరమునీంద్రులను
శిక్షించి ప్రోచినశివుఁడ రక్షించు

సోమనాథ స్తవము.

మునుల శ్రీదక్షిణామూర్తి వేషంబు
నను బ్రోచు టిరువదినాల్గవలీల.

పండితారాధ్యచరిత్రము.

ఒక్కొకదేవత కొక్కొకవృక్షము ప్రియ మగుట భారతీయసంప్రదాయము. శ్రీమహావిష్ణువు ప్రళయకాలమున మఱ్ఱియాకుపై విశ్రమించును. కావుననే 'వటపత్రశాయి' నామము ధరించినాఁడు. బిల్వము శివునకుఁబ్రీతి.

కళికవివరణము.

2. ఇందు శివునిసర్వజ్ఞత్వము వర్ణితము.
3. నంబి=సుందరమూర్తినయనారు- అరవమునఁ గొప్పకవి. తెలుఁగున నోడయనంబివిలాస మీతనిచరిత్రము దెలుపును. బరవసంకిలి యనుపేరులుగల యిరువురుభార్యల నీతనికి శివుడు దూత్యమునడపి పెండ్లిసేయించెను.
4. బల్లహుఁడు=భల్లాణరాజు- ఈకథ తెనుఁగువారికిఁ బ్రేమపాత్రమైనది.
5. అలకయేలురాజు- అలకాధిపతి కుబేరుఁడు.
అల్ల- నిర్దేశమునను బ్రసిద్ధమునను వాడఁబడును.
ఇచ్చట ప్రసిద్ధి యనునర్థమున వాడఁబడినది.
అల్ల యనఁగ మందము, కొంచెము ననునర్థము.
అల్లనవ్వు- అల్లఁదనము. హరి. ఉ. ౬-౧౦౫-

ఉత్కళికవివరణము.

ఇందు త్రిపురాసురసంహారము వర్ణితము:

చూడుఁడు-

సీ. ఖండఖండములుగాఁ గదిసిన తేరికి
భంగంపుటిరుసు పాకసంగఁగూర్చి

విజ్ఞోడుపడి విచ్చకవినువీథిఁ దిరిగెడు
చక్రంబు లోనఁగూడక సంఘటించి
తలకొన్న భీతి కొంకదలపడ బహుముఖ
భ్రాంతసారథి నేరకపరిగ నిలిపి
పలుకపదక్రమంకబుల నలుజాడల
బోయెడు గుఱ్ఱముల్ కపూనుకొలిపి
కుంటివింటనుఁ బలువంకఁకగోలఁ దొడిగి
విషమలక్ష్యంబు లేగతికవేసి తయ్య
వేల్పులెవ్వరు నీసాటికవిజయవాటి
మల్లికార్జునలింగ ! ఉకమాప్రసంగ.

(బొడ్డపాటి కొండయ)

---

చతుర్థీవిభక్తి.

ఉ. ఆఱడియాస నీరసధరాధిపలోకము లిండ్లు వాకిళుల్
దూఱుట మాని శ్రీనగముతూరుపువాకిలిఁ జొచ్చిపాపముల్
నీఱుగఁ జేసి గంధవతినీటనుఁ గ్రుంకి మనంబులోని చి
చ్చాఱఁగఁజేయుటొప్పుత్రిపురాంతకదేవునకై నమస్కృతుల్.

ఈపద్య మప్పకవీయమున నుదాహరింపఁబడియున్నది. ద్వి. ఆ. 214 పద్యము.
గంధవతి త్రిపురాంతకమునందలి తీర్థము.
ఆఱడి— విశేషణము— వ్యర్థ మని యర్థము.
ఆఱడి— విశేష్యము— కష్టము, హాని, నింద మొదలగు నర్థములఁ బ్రయోగములు
గలవు.
ఆఱడి— క్రియావిశేషణము— నిష్ప్రయోజనము.

కళిక - వృషభగతిరగడ.

మఱియును మెఱయఁగ దిశలనియెడు నును ఽ మడుఁగులు-
గట్టిన శృంగారికినై
కొఱలినదయ బాణాసురమోసల ఽ కూఁడిమిఁగాచిన
ఫణిహారికినై
మేలపుఁజదువులు చదివిన విని మది ఽ మెచ్చినలక్ష్మీపతి
బావకునై
యీలువుగల సద్భక్తులు ముక్తికి ఽ నేగెడు చేరువ
పెనుత్రోవకునై
కూటికిఁ గూరకు భక్తులఁగూడిమి ఽ కొడుకుల నడిగెడు
వెడజోగికినై
ఏటికి బోటికి జడలును నోడలును ఽ నిచ్చినజగదేక
త్యాగికినై
ప్రొద్దును రేవెలుఁగును నేత్రములై ఽ పొలయఁ గనుంగొ
నియెడు దేవునకై
నిద్దము లగుపెద్దలపే రెఱుకల ఽ నెలకొనియెడు నిశ్చల
భావునకై.

---

ఈలువు- త. ఇయల్బు- మంచినడత.

ఇచ్చట యనన్యాశ్రితభక్తి- ఈలువు- పాతివ్రత్యము.

చిరుతొండడు- సిరియాలుఁడు ఈతనికథ తెలుఁగువా రెఱిఁగినదియే.

ప్రొద్దు=సూర్యుఁడు, బ్రధ్నశబ్దభవము.

ప్రొద్దెక్క- అనుపదమును ప్రొద్దు చూచినఁగాని భోజనముచేయరు- అనువాడుకయందును సూర్యపరమైన యర్థము.

ఉత్కళిక.

కడుదీనతతో ముదితాపసికై
వడినింటికిఁ జని వెడకప్పెరకై
కొని యాలిమగలఁ బెనురచ్చలకై
చనుదెండని నిక్కము సేయుటకై
వెనుద్రిప్పిన గుండములోపలఁ గై
కొని చని తన యెప్పటిరూపముకై
కొని గుండయ మెచ్చినవేల్పునకై
వినతపితామహఫణితల్పునకై.

---

పంచమీవిభక్తి.

ఉ. పోయెడుఁ గాల మన్యగతిఁ బొందదు, మోక్షము వెండికొండకుం
బోయెడుత్రోవ మీకెఱుఁగఁ బోలదు మానవులార! రండు లేఁ
బ్రాయపుఁగొండ కంచు శివభక్తులలోపల నద్రిరాజక
న్యాయుతపుణ్యమూర్తి వలనం గడ తేరెడు జన్మఖేదముల్.

కళిక - జయభద్రరగడ.

మఱియు సకలాశ్రితుల మనుచునర్థమువలన
వఱలు పరమానంద వనధి తీర్థమువలన

---

బాణునికి లింగావసరకాలమున నీశ్వరుఁడు వాకిటికాపులవాఁడై యున్న కథ బసవపురాణమునఁ జతుర్థాశ్వాసమునఁ గలదు.

గుండయకథ- బసవపురాణము- చతుర్థాశ్వాసము 139 పుట.

కౌమరుమిగిలిన మంచుకొండయల్లునివలన
విమతపురదహానకర ౹ విష్ణుభల్లునివలన
శివభక్తహృదయసంచితనిధానమువలన
వివిధరూపములలో ౹ వెలయుజ్ఞానమువలన
అజ్ఞానఘనతమం ౹ బడచుదీపమువలన
సుజ్ఞానులకుఁ బొడసూపురూపమువలన.

ఉత్కళిక.

తనకినుకలోఁ బుట్టి
కనలి దక్షునిఁ గొట్టి
యడరి వేల్పులఁ బఱచి
తొడరి జన్నము చెఱచి
వీరభద్రుఁడు వచ్చి
చేరి మ్రొక్కిన మెచ్చి
యలరునిత్యునివలన
దళితదైత్యునివలన.

ఉత్కళికయందు దక్షాధ్వరధ్వంసము వర్ణితము.

షష్ఠీవిభక్తి.

చ. కమలజుతోరపుంబునుకſకంచము, పాదసరోరుహార్చనా
కమలము వారిజోదరునిſకన్ను కరంబున కాదిభోగిభో
గము రవణంబు, చంద్రుఁడు శిſఖాకుసుమంబౌ, మెవ్వ
రీసు మా
రమణునకుం గుమారగిరిſరాజనివాసున కన్యదైవముల్.

కళిక – హయప్రచారము లేక తురగవల్గనము.

మఱియు మెఱయు వేదవాద ſ మథనకథనసారమునకు
మెఱయు దొట్టముట్టి ముట్టు ſ మేటినీటితీరమునకు
బత్తు లుత్తు లొరసి యొరసి ſ పట్టు గట్టి తేజమునకు
సత్తుఁ జిత్తు దాన యైన ſ సత్యనిత్యబీజమునకు
వలచి కొలుచువారిఁ జేరి ſ వలపుదలఁపు రయ్యమునకు
నిలిచి నిలిచి చూడఁ జూడ ſ నిండియుండు తియ్యమునకు
మునులు ఘనులు బోధపేధి ſ ముట్టినట్టి తత్త్వమునకు
పనులుఁ గనులు నెఱుఁగనట్టి ſ పరమపదమహత్త్వమునకు.

ఉత్కళిక.

కదలి వదలి జూటకోటి
చదలఁ బొదల నేటినీటి

1. వాతపురి- సంస్కృతము- (చిదంబరము-) రసవాదపుటూరని ద్రావిడోత్పత్తి.

కడలఁ గడలఁ జెంది చెంది
జడల నొడలఁ బొంది పొంది
బాలలీలఁ జూడఁ జూడ
సోలి లీలఁ గ్రీడలాడ
నాదినాథజనకమునకు
నాదపూరికనకమునకు.

---

## సప్తమీవిభక్తి.

ఉ. వాచవిలోనుగా నొడలికైవాకిళులం బొడచూపు తీపులం
గ్రోచి శివార్చనానియతికైతో వెలిచూడక చూడనేర్చినన్
లోచనిఁ బోలునేచవులు, కైలోకము చూడని చూపులంగుమా
రాచలనాథునందుఁ ద్రిపుకైరాంతకునందు గరంగు చిత్తమా!

కళిక - జయభద్రరగడ.

మఱియునుఁ గటాక్షజిత కై మారునందు
దఱిత్రాడు సొమ్ముగును కై దారునందు

---

తఱిత్రాడు=కవ్వపుఁద్రాడు- శేషుఁ డమృతమథనసమయమున మంధరపర్వతపుఁగవ్వమునకుఁ దఱిత్రాడైనవాఁడు.

ఈశబ్దము శబ్దరత్నాకరమున సాధురేఫవిశిష్టమై యున్నది.

సొమ్ము=ఆభరణము- ఈయర్థమున నిది ప్రాచీనప్రయోగము.

కరికాల చక్రవర్తి కీశ్వరుఁడు పసిఁడివాన గురియించినాఁడు.

ఉత్కలికయం దీశ్వరునియష్టమూర్తిత్వము వర్ణితము- చూ. శాకుంతలము నాందీశ్లోకము- 'యాసృష్టిరిత్యాది'-

బరువూను భక్తపశు | పాలునందు
కరుణాసుశీతకరి | కాలునందు
జగములు జనించు తొలి | జాడయందు
నిగమార్థముల్ నిలుచు | నీడయందుఁ
బోడ వెల్ల శాంతి యగు | పుణ్యునందు
గడలేక యొప్పు నర | గణ్యునందు.

ఉత్కళిక.

ఇలయు సలిలంబు
వెలుఁగు ననిలంబు
దివియు మిత్రుండుఁ
గువలయాప్తుండు
పరగుయజమాన
పరిపూర్ణుఁ డైన
యష్టతనువందు
శిష్టతనునందు.

సంబోధనము.

ఉ. శ్రీచనుదోయిపై శరముఁ | జేర్చి, భుజఁగమరాజసజ్య హే
మాచల మెక్కుడించి నిగ|మావళి యశ్వులుఁ బేర్చి, పద్మజుం

1. పోటుముట్టు=యుద్ధసాధనము- ఈశబ్దమునకు విక్రమార్కచరిత్రమున నుదాహరణము గలదు. 2- ఆ. ఈప్రయోగము ప్రాచీనము.

జూచి మొగంబు లిచ్చిదివి।జుల్ గొనిమూడఁగనున్న నీ రణాం
తాచరణంబు వింమఁ జెవు।లారఁ గుమారగిరీంద్రమందిరా!

కళిక – జయభద్రరగడ.

మఱియు నానామంత్ర । మణిగణసుధాకల్ప!
కొఱలు నేనుఁగుమోము । కొడుకుఁ గాంచినవేల్ప !
మూఁడుమోముల[1]పోటు । ముట్టుఁ బట్టెడుశూర !
వేఁడిచూపునఁ దివ్య । విలుతుఁ గ్రుంచినధీర !
తాపసుల యీలువులఁ । దనరు తపములపంట !
చూపులకు నెల్లఁ బర । సుఖవార్థిపెన్నింట !
తిలకాయమానదీ।ధితిసుధాసంసూతి !
వెలుఁగులకు నెల్లఁ దుది । వెలుఁగగుపరంజ్యోతి !

ఉత్కళిక.

వినుతముఖనలినమును
ఘనజఘనపులినమును
వరవళితరంగములు
గురుకుచరథాంగములఁ
గలిగినయుమాసరసి
లలితముఖములఁ బెరసి
క్రాలు నొకకలహంస !
బాలచంద్రోత్తంస !

## సార్వవిభక్తికము.

శా. నీ వాద్యుండవు ... ప్రథమావిభక్తి
నిన్నుఁ దెల్పఁ జనువుల్ ... ద్వితీయావిభక్తి
నీచేత మే లొంద ... తృతీయావిభక్తి
నీకై వాక్ప్రజ లొనర్తు ... చతుర్థీవిభక్తి
నీవలన బ్రహ్మాండావళుల్ పుట్టు ... పంచమీవిభక్తి
నీ కేవేల్పుల్ సరి, యన్యదైవభజనం బే నొల్ల- షష్ఠీవిభక్తి
నీయందు మద్భావం బుందఁదగుం సప్తమీవిభక్తి
కుమారగిరినాథా ! చంద్రచూడామణీ !- సంబోధనము